"మూడమంచు", "అర్జునుడు గవియించిన యంప మూడమంచు పెళ్ళముగఁ గప్పిన"— అని. మూడు = మూయు. మూసుకొని వచ్చిన మంచు—మూడమంచు.

ఓజలు మెఱయు—భీముఁడనేక విధముల నోజలు మెఱయుచు'

కోఱడిల్లు—"ఇట్టి పనికి నూఱడిల్లి తోడుకొనఁగ నిచట నీడను చుట్టంబుఁ దడవి పడయు వాఁడనొక్కొ." = ఉపశమించు!

"బిట్టేసిన మసనుని చే ధృతివాసిన సింహబలుఁడు." చే = తృతీయార్థము 'మూలముగా' ననియా?

"ఇడ్డ దానియ్యెడ కేగు దేవలయు లేపని సేయఁగ బూని"

"దీనిపై నెయ్యముకల్మి యే కొలది నీమదికింతయు నాకుఁ జెప్పుమా"—షష్ఠీప్రయోగ విశేషము గమనింపఁ దగినది = నీమనస్సునకు దీనిపై స్నేహముండుట.?

"ప్రియము <u>చూపి—మునుఁగువడఁ</u> దనుసంభావించు నెడ"

దెస = దురవస్థ = అవస్థ — "తననీచపుదెస యొరు లెఱుంగక యుండెడ" ఇప్పుడు 'దిక్కు' 'వైపు' అనియే యర్థము.

బ—కలిమికి నొప్పగు నీగియు బలిమికి దొడవైనయట్టి బలగమునై." = బలగము కలవాఁడై యను నర్థమున.

"మత్స్యపతిమును దనయలుకలో నివాఁడ కాఁదలంచి"

"పలుకంగఁ జాలఁడయ్యెడునకటా"

"శౌర్యవైభవ ప్రాభవశౌచములకు నొరులకైనఁ <u>గైవారమై యుల్లసిల్లు</u>"

"తనవర్తనము విన్న మునిజనంబులకైనఁ సలవరించుకొనఁగవలయువాఁడు"

“రిత్తకు రిత్తచెలగినవ్వు”

“తమయన్నకు నగ్గి యిచ్చువారై”

“వాశేమునికేని మతియుం దగనాడి”

“నీమాటలకు నేమిగులంగా వెఱతుఁబోదు మీ యెట్లుండెడ్”

“మనకు మార్కొను నట్టి కొలఁదికాదు”

బాసట లేరయెవ్వరున్”

“తనతన వాహనము లాయుధము లెల్ల జనంబులు ననువు సేసికొనుడు”

“ఇవి నీ తెగకొలఁదివి.”

“పాండునందనులయున్న యిమ్మెయిఁ గానవేఁడి”. తమి_వేండుం.

“బలమెల్లఁ వెఱరెండురూపాయలుగఁ జొచ్చి”

“నాలువుగఁ బోయి”

“భయరసము వట్టువెట్టునఁ బగఱువాఱ”

“పెద్దదొరలు చీరలొలఁ [illegible]”

“పతిరొయెఱుఁగఁడొకో జనులు నిజము సేయుదుకే”

“దుఃఖములకు నగపడకుండ”

“క్రీచకుఁ బరిమార్చుటకిప్పుడు గడవఁబడియెనే”

## కారకవిశేషములు

“ఇంతకు నేర్చునీకు”

“నినుంగొని యాడుచేతఁ దానెంతయుఁ బెద్ద”

"తద్వ్యాప్తమునకు నస్నేలుము.

"యక్షునిచే నగపడ్డవీని ప్రాణంబులు.

"విసరి నేలతో వ్రేసి వీపునమండిపెట్టిన"

"కీచకునిదెస నన్నొకకీడు తెరవు పొరయకుండగావుము"

"కీచకుసురాచగణంబు నాకు బ్రకటించి"

"ఇట్లు లోక మూర్ఖునిచేఁ దుదిఁబోయి కోలుపోయిన యభిమానము"

"పృథాసుతుల దిక్కునఁ దద్దయుభీతుఁడై"

"వారికిఁ విలాపము సేసె"

"తలపోతగలిగి యమ్మొలతవచ్చుటకుఁ దానొండు వింతలు పుట్టఁ కుండఁనొక్క"

"గంధర్వులచే పడి మృతినొందె"

"సైరంధ్రి కపాయము వొందదని యూహించి"

"వారికినుతింపగ నేల నిసర్గవృత్తయుల్"

"మాకుంజూడ పాండవులు పొడవడంగి లేకపోయిరి.

"నాతోడి ప్రేముడింగడు నాతురరై"

"ఏమనివినిరొందనో నీచేనడు."

"వారలకు పగవవలదు."

"ఆతని నెవ్వరికేనియుం బొగడవలయు."

"పాపమున గురులకు మార్కొనియెదము"

ఇట్లు తిక్కనార్యుని యాంధ్రభాషా జాతీయప్రయోగ చమత్కారము లపారమలై వెలయుచున్నవి. అతని భాషాశక్తి, ప్రయోగ

చమత్కృతి, జాతీయవైఖరి, పదసంగ్రహణ నైపుణి, యనన్యసామా
న్యములు. అప్పటి తిక్కనార్యుని భాషకును, ఇప్పటిభాషకును విశే
షవ్యత్యాస మగపడుచున్నది. ధాతు, పద, కారక, క్రియారూప,
జాతీయప్రయోగ విషయమున నెంతేని భేదముకలదు. ఆతని కాలము
నందలి యాంధ్రభాషా స్వరూపస్థితిం గనుగొని, అది కాలక్రమమున
నెట్టిమార్పులకులోనై ప్రస్తుతస్థితికివచ్చినది, అప్పటి యాతని భాష
యెంతవఱకంతరించినదియు దెలిసికొనుటకుగా నాతని భారతమందలి
దేశీయ పదముల పట్టికలను తియారుచేయుట యెంతయు నావ
శ్యకమై గన్పడుచున్నది. వీనిని తరువాతి భాషతోడను, పూర్వకవుల
యొక్కయు శాసనములయు భాషతోడను బోల్చినచో నాంధ్ర
భాషాచరిత్రమును గొంతవఱకు దెలిసికొనుట కవకాశమేర్పడఁ గలదు.

## ఉపసంహారము

ఇట్లు సహజంబై, సలక్షణంబై, శక్తివంతంబై, జాతీయ
యుక్తంబై, దేశీయబహుళంబగు నాంధ్రభాషలో, భవ్యకవితా
వేషుండు, విజ్ఞాన సంపద్విఖ్యాతుఁడు, సంయమిప్రకర సంభావ్యాను
భావుండునగు కృష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబుగాని రచించిన
లేఖ్యంబగు నీ యామ్నాయమునందలి యర్థమును ప్రబంధమండలిగా
రచించియాంధ్రావళికి మోదముం గూర్పనెంచిన తిక్కనార్యుఁడు "హృద
యాహ్లాది, చతుర్థ, మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి"
యగు నీవిరాటపర్వమును రచించు సందర్భమున, సంస్కృత మూలమునం
దలియర్థమును కావ్యకళాదృష్టితోఁ జూచి యందలి విషయముల యౌచి
త్యానౌచిత్యములను, గుణదోషములను బరిశీలించి మూలమునందలియే
విషయమెచ్చట నుపయోగించుకొనవలెనో దానినచ్చో నుపయోగించు
కొనుచు, సందర్భానుకూలముగఁ రసమును బోషించుచు, పాత్రలశీల
మును వ్యక్తీకరించుచు, సంభాషణలను బెంచుచు, కథాంశములను

దాగుమారుచేయుచు, కావ్యకళా సౌందర్యమునకుఁ దోడ్పడని సంఘర్ష
ములను విడనాడుచు, వద్దానిఁ బోషించుట కనువగు వర్ణనలను-అనఁగా
ప్రకృతి వర్ణనలను, శీలపోషక వర్ణనలను, భావవ్యాఖ్యానసూచక వర్ణన
లను మనోవృత్తి ప్రకాశక —ప్రస్ఫోరక— వర్ణనలను, స్వీయదేశీ
యాచార వర్ణనలను సందర్భానుకూలముగ స్వయముగరచించి చేర్చుచు
దనభాషాంతరీకృతగ్రంథము నత్యంత రసోద్బోధకంబై కావ్యకళకా
దర్శభూతంబై స్వతంత్రంబగు నుత్తమ ధ్వనికావ్యముగనొనర్చినవాఁడై
నాడు. ఆంధ్రావళి కత్యంతమోదముం గూర్చినాఁడు. భక్తకోటికి వర
ణీయుఁడైనాఁడు. తాననుభవించినకవిత్వతత్త్వ నిరతిశయానుభావానంద
మును దనదేశీయులకుఁ గూడ చవిగొలిపినాఁడు. ఇఁక ఉద్యోగాదులను
తక్కిన పదునాల్గింటిలోఁ గూడ నాంధ్రావళి యీమహనీయుని
కావ్యశిల్పమహత్త్వము నారసి యత్యంతామోద భరితులై కావ్యర
సాంబుధి నద్వైతానందాంబుధి నోలలాడుదురు గాత!!!

